# ఉపోద్ఘాతము.

చదువరులారా!

ఆశ్రితాపద్ధరాధరదివిజేశ్వరుండగు సర్వేశ్వరుని యనుగ్రహం బున నాంధ్రగీర్వాణభాషలయందు నాకులభించిన పరిచయలేశంబుననే నీ స్తోత్రంబును వ్రాయంబూనుకొంటిని. గ్రంథరచనయందు నాకిదియే ప్రథమప్రయత్నమగుటచే నిందుస్వల్పదోషము లుండవచ్చు—నుండినను పండితులగు మీరందరు నాయందు సదయహృదయులై, యసద్ధఘోషణంబులగు నాదోషంబుల దెలిపినచో వందనపూర్వకముగా నందుకొని పునర్ముద్రణంబున వానిని సవరించుకొనుచున్నాడను.

ఇట్లు,

ర్యాళ్లబండి నాగభూషణశాస్త్రి.

గుడివాడ తాలూకా
కొమరవోలు
పామర్రు పోష్టు.

చ. కవిజన కీర్తనీయులల ♦ కమ్మకులీనులు సారలంకృతిం
గవరపు వీరభద్రయని ♦ గర్వశిరోమణి తత్సహాయ సం,
భవమున ముద్రితంబగుచు ♦ బ్రస్తుతులం గనునీ స్తవంబు త
ద్రవి శశితారకంబుగ వి♦రాజిలు గాత జగత్త్రయంబునన్.

---

## ఉత్సాహ.

రాలబండి నాగభూష ♦ రచితకావ్య మిద్ధిమే
ల్మేలటంచు జనములెల్ల ♦ మిగుల బ్రీతి జదువగా,
వీలగుంబ కేశునిందు ♦ వేట్కమీర బాగసుట్
జాలముద్ధవద్ధినములు బ్ర♦శంస కెక్కి యొప్పుటన్.

ది-23 సెప్టెంబరు-1915
బందరు.

ఇట్లు,
సరసచతుర్విధకవితా సామ్రాజ్య ధురంధరులగు
నాదెళ్ల పురుషోత్తమశాస్త్రిగారియంగీకృతి.

మిత్రవర్యా !

మీచే సంపుటంబడిన శ్రీ సర్వేశ్వరతారావళి నామమూలాగ్రముగాజూచి యిది లోకోపకారము చేయుటకు సందేహము లేదని తలంచితిని.

క. రసపుష్టియు బదమార్దవ
మెసగగ జెలువారుచున్న ♦ యీ స్తవరాజం,
బొసగున శిష్టంబులు దు
ర్వ్యసనంబుల దొలగజేయు ♦ వారల కెల్లన్.

ది-24-9-15
బందరు.

ఇట్లు,
ఇచటూరి పాపయ్యశాస్త్రుల్లుగారి ప్రియశిష్యుడగు,
కొమ్మగంటి లక్ష్మీనరసింహారావు.

శ్రీ

సర్వేశ్వరాయనమః.

# సర్వేశ్వరతారావళి.



శా. శ్రీమత్పాదప  ద్మముద్రిత ధరి♦త్రీ భృత్శిరోభాగ సు
త్రామద్విణ్మరుదుగ్రనాగ చతు♦రక్షత్యాగ బర్హిర్ముఖ,
స్తోమత్రాణ కృతానురాగ నతని♦ర్దుష్టావనోద్యోగ దు
ర్గామానిన్యనుభోగ నీకిదె నమ♦స్కారంబు సర్వేశ్వరా. ౧

మ. స్థిరవా గర్ధగతాభిధాన పదరా♦జీవద్వయీ లాంఛన
స్ఫురితోద్యాన వా  'హవస్థిరద స♦త్పూర్వామరస్థాన ము,

ష్కరకాంతారదవోపమాన త్రిజగ♦త్కల్యాణసంధాన శం
బరవైర్యగ్నిభిదానిదానయని ని♦న్బ్రార్థింతు సర్వేశ్వరా. ౨

శా. సంగాదుల్వరి వర్జనీయములు ని♦స్సంబంధమీదేహ మ
ర్థాంగుల్పుత్రులు వెంటరాదికధన ♦ ద్రవ్యంబులానిల్వవే,
రుంగావాడెదు వారులేరని మనో♦రూఢిన్ భవత్పాద సా
రంగద్వంద్వము నాశ్రయించితి కృపన్ ♦ రక్షింపు సర్వేశ్వరా. 3

మ. అరిషడ్వర్గము నొంచి దుష్కరనిరా ♦ హారవ్రతంబూని సు
స్థిరతంగాన దపించుతాపసులె బు♦ద్ధిన్ నిన్నుబోల్పంగ జా,
లరునా నన్యులికెంతవారయిన ను♦ల్లాసంబునై త్వద్గుణో
త్కరసంభావన మాచరింతువిన వే ♦ కాంక్షించి సర్వేశ్వరా. ౪

శా. చేతశ్శుద్ధిగ నీదునామమును లో♦జింతించెనే నీ మహా
భూతప్రేత పిశాచరాక్షస గణం♦బుల్మాయు మాయున్ భవా,

సీతాఘప్రకరంబు లింతటినిను ♦ న్జెప్పన్వశంబౌనె మా
కేతాదృగ్విధ దుష్ప్రవర్తకులకూ ♦ హింపంగ సర్వేశ్వరా. ౫

మ. ఎవడీలోకములన్ సృజింపవిధినా ♦ నిందీవరంబందు ను
ద్భవముం జెందెను యెవ్వడా త్రితొలగం ♦ బాలింపగా విష్ణర,
శ్రవుడై సన్నుతిగాంచెనో విలయమున్ ♦ సల్పన్ మహారుద్రుడై
యెవడింపొందెను యమ్మహామహుడవీ ♦ వే కావె సర్వేశ్వరా. ౬

శా. దీనత్రాణపరాయణుండవని నీ ♦ దివ్యత్పదాంభోరుహ
ధ్యానోద్యోగము జేయుచుంటి నినుగా ♦ కన్యు న్మదింగొల్వగా,
బోనేరీతిని బ్రోవనుంటివో భవాం ♦ భో రాశిదాటించి వి
జ్ఞానోత్పత్తికి దారిజూపవె ద్విష ♦ త్సంహార సర్వేశ్వరా. ౭

మ. ఒకమారైనను భక్తిపూర్వకముగా ♦ నుద్యద్భవన్నామ తా
రకమంత్ర స్మరణంబొనర్పక సదా ♦ రామాభుజాశ్లేషణో,

తృ్నక దుర్వృత్తిని గాలముంగడపి యీశుఁ నిన్ను జేరంగ నే
రకయుంటిం దుదకెల్ల ప్రోచెదవొ భా♦రంబూని సర్వేశ్వరా. ౮

శా. భావాతీతజగత్ప్రసిద్ధమహిమా ♦ పాంచద్భవత్పాద రా
జీవద్వంద్వము నాశ్రయింపక యెమ♦శ్చింతాపరుండౌచు నే,
దేవానాంప్రియుఁడు జ్వలజ్జలచరో♦ద్దీర్ణోగ్రసంసార పా
రావారంబును దాటశక్తుఁడగు సా♦రాచార సర్వేశ్వరా. ౯

మ. కలలోనైతము నీ పదాబ్జయుగమే ♦ శాంతిక్షితిన్గాని య
న్యుల సేవింపదలంపనైతి శ్రిత బం♦ధూ వేగమే త్వత్కృపా,
కలనం దేల్పుము చాలడస్సితిని భ♦క్తత్రాణ దక్షుండవ
న్పలుకున్నిల్పుము దేవదేవ కరుణా♦పారీణ సర్వేశ్వరా. ౧౦

శా. మున్నెన్నో పొసరించినాడ నఘము ♦ ల్మూర్ఖుండనై యిప్పుడే
తెన్నుంగానక నీకు బాల్పడితినో ♦ దేవా మహాదుఃఖ సం,

ఛన్ను న్నన్నొకదారిఁ జేర్పుము మనం ♦ జాలుర్ జగద్రక్షణా
క్షాన్నత్యంబున నీవు ప్రోచిన కృతా♦ర్థ శ్రేణి సర్వేశ్వరా. ౧౧

మ. అలపాక్షీంతయు గల్గనీకనిరతం ♦ బత్యాప్తితో ధారుణీ
స్థలిపై బ్రాకుపిపీలికాదుల కనం♦తం బందువర్తించు ప,
క్షులకున్మేతయు నీరునీగలుగు ద♦క్షుండెవ్వఁడో యట్టి యు
జ్వలతేజోమయమూర్తిని న్నినుమదిం♦బ్రార్థింతు సర్వేశ్వరా. ౧౨

శా. ఆ కళ్యాణగుణాకరుండవగు ని♦న్నర్థించుటన్ దన్యులై
పాకారిప్రముఖామరప్రముఖులే ♦ స్వస్థైర్యముం జెందిరీ,
లోకశ్రేణియు నీకృపాకలనచే ♦ లోపంబు లేకుండఁగ
స్తోకశ్రీలఁదలిర్చుచున్నయది చి♦త్రమ్మాపాత్మ సర్వేశ్వరా. ౧౩

మ. మనుజుండై సకలంబెఱింగియు జగ♦న్మాన్యున్ నినుం బూజ సే
యని దుష్కర్మకుఁడే ద్విపాదపశు వ♦వ్యామోహతుండై మనం,

బున సర్వంబుభవన్మయంబుగ దలం♦పుల్ సేసినీపాదముల్
మనమందెంచి భజించునట్టిఘనుడే♦మర్త్యుండు సర్వేశ్వరా. ౧౪

శా. ఈవేచంద్రుడ వీవెభాస్కరుడ వీ♦వే క్షితిపుత్రుండ వీ
వే విష్ణుండవజుండ వీవెసకలం♦బీవే జగంబేలగా,
నీవేకాంచిత నేకరూపకతముల్ ♦ నేర్పారనొండయ్యునా
నావస్తుత్వముగాంచిమించెడి సువ♦ర్ణంబట్లు సర్వేశ్వరా. ౧౫

మ. చతురంభోధిపరీత భూతలము నీ♦స్వాధీనమై యుండ భూ
పతినంచొక్క మనుష్యమాత్రునకు గ♦ర్వంబేల మందూక మా
శ్రితసంరక్షణ తత్పరుండయిన త♦చ్ఛ్రీనాథుడౌనేన మం
చితరీతిం హరినన్న మాత్రమున కా♦శీవాస సర్వేశ్వరా. ౧౬

శా. దారింబాంధులుగూడి వీడుగతిం ద♦త్కాలాను సారంబుగా
దారల్ పుత్రులుమిత్రులాప్తులును భా♦త్రిత్వేడిపో నాదుర్,

దారిఁ లోఁబరికించు ప్రాజ్ఞునకు జెం♦దఁ రావు శోకంబు లా
ధీరుల్పంకమునందు కీటకము భా♦తిఁ మింత్రు సర్వేశ్వరా. ౧౭

మ. కలుషంబుల్ తొలగింపజాలిన భవ♦త్కారుణ్యముం గొన్న భ
క్తులు సేవింపదలంపరన్యుల శర♦ద్జ్యోత్స్నావాహినీ విస్ఫుర,
న్నలినాంచన్మకరందపానజనితా♦నందభ్రమద్భృంగ పం
క్తులు వన్యప్రసవాళిజేరునె జగ♦త్స్థూలాత్మ సర్వేశ్వరా. ౧౮

శా. నిన్నున్నమ్మిన వారికెన్నటికి లే♦నే లేవు కష్టంబులా
పన్నుల్దుఃఖవిముక్తిగాంతురు భవ♦త్పాదంబు లర్చించికా,
కున్నందొల్లిమృకండు నందనుడు శ♦క్తుండయ్యెనేలా నిజా
సన్నప్రస్ఫురదబ్జమిత్రతనుజుఁ♦ జంకింప సర్వేశ్వరా. ౧౯

మ. భవరోగంబుల బాపజాలిన భవ♦ద్భక్తి న్విడంబించు భా
గవతశ్రేష్ఠునకేమి లోపమొక దు♦ష్కర్ముండు నిందింపనై,

జవిలాసక్రమయుక్తి నున్న కరిణిఁ ♦ శ్వానంబు కవ్వించియా
ర్వవహింపంగలదేమి జాడ్యమపుడా ♦ భద్రంబు సర్వేశ్వరా. ౧౦
శా. వేదాంతార్థము భక్తిమై జదివిత ♦ ద్విజ్ఞాన సంపాదితా
మోదంబే భగవత్స్వరూప మనియే ♦ పుణ్యాత్ము లూహింతురో,
యాధన్యుల్ వినుచుర్ భవద్యశమున ♦ త్వాప్తిఁ శరచ్చంద్రికా
ప్రాదుర్భావము వేట్కసేయదె చకో ♦ రశ్రేణి సర్వేశ్వరా. ౧౧
మ. తనరంబూర్వీక నిశ్చితస్వ మతసి ♦ ద్ధాంతాను సారంబుగా
ఘనభక్తిన్ సకలార్థ సిద్ధికొఱకై ♦ కాంక్షించి యెప్డుఁ జగ
జ్జనముల్ చేసెడు సర్వనిర్జరనమ ♦ స్కారంబులుఁ నిన్నుఁ జెం
దునభోనిర్గళదంబు సంఘము సము ♦ ద్రుంబోలె సర్వేశ్వరా. ౧౨
శా. దారంబట్లు సరంబునందు జగదం ♦ తర్యామివై నిత్యముఁ
ధారాళంబుగ సర్వజంతువులక ♦ త్యంతంబు జేకూర్తువా,

హారంబీవుదరంబునం బెరుగునే లాపిండ సంఘంబు నీ
వేరక్షింపనిచో గృపాబ్ధియననీ కేచెల్లు సర్వేశ్వరా. ౧౩

మ. తలిదండ్రుల్సమకూర్చి యిచ్చినధన ద్రవ్యంబులన్ రోవెలం
దులభోగాలకు వెచ్చబెట్టుచు మదాం ధుల్ నాబ్రవర్తించుమూ
ర్ఖులుయుష్మత్కృప నందజాలర సమ ర్థుల్ శక్యమా నేబకం
బులకున్మానస నీరజాకర రసం బుంగ్రోల సర్వేశ్వరా. ౧౪

శా. యావచ్ఛక్తియు ధారవోసి గురుబో ధావాప్తిజేబట్ట వి
ద్యావిస్తారులుగాక యన్యులు భవచ్ఛక్తిన్ గ్రహింపంగనే
రావం తేనియు వేదపుర్వులకు శక్యంబౌనె యాకాశ గం
గా వాహాన్యరవింద సౌరభము నాఘ్రాణింప సర్వేశ్వరా. ౧౫

శా. సారంబింతయు లేనిదయ్యు మదికా స్సగ్గొల్పునీఘోర సం
సారాబ్ధింబడి తల్లడిల్లెడు మహా జ్ఞానాంధకారుల్ జగ

ద్ధీరుఁ నిన్నుతింప జాలరు కరో♦దీర్ణ స్ఫురద్భాస్కరా
కారంబున్గన గుప్తగూఢబలకు శ♦క్యంబౌనె సర్వేశ్వరా. ౧౬

మ. అవనీరత్నతత్పరుండవగు నీ♦కర్పించితిం ద్వత్కటా
క్ష విశేషంబున సార్థకంబగున నీ♦కావ్యంబులో కేత ర
స్తవనీయంబున భీష్టదంబు వివిధా♦ర్థ ప్రాభవాంకంబు గా
రవపూర్వంబు విభిన్న పాతకలు పా♦రణ్యంబు సర్వేశ్వరా. ౧౭

మ. స్తవముం జేసితి నీకు భక్తుడ సము♦ద్యద్రాళ్ల బండ్యన్వయో
ద్భవుడం గామయకుందనూభవుడ సు♦బ్రహ్మణ్యశిష్యుండ స
త్కలితాధన్యుడ నాగభూషణుడనే♦తత్ స్తోత్రతారావళి నా
రవితారంబుగ నిల్పుబ్రోవు మఖిలా♦రాధ్యాత్మ సర్వేశ్వరా.

శా. ధీనద్ధత్రిదివేశకల్మష ధరి♦త్రీ భృత్సురాధీశ గం
గానద్వ్యావృత కేశపాశ ♦ సకలక్ష్మామండల స్థాశ్రితా

జ్ఞానధ్వాంతదినేశ । నిర్మలయశ స్సంక్రాంత దిగ్దేశ ని
త్యానందైక సుఖప్రకాశగత ♦ రోషావేశ సర్వేశ్వరా.

మ. ధృతశూలాయుధ మంగళంబుదివిష ♦ ద్విస్ఫారపూజాస మం
చితపాదాంబుజ మంగళంబు నిహతా ♦ శేషాహితా మంగళం
బుతుషారాద్రి సుతాహృదంబు జల♦సత్పూషాయుతా మంగళం
బుతటిన్యావృతవేశపాశ ♦ త్రిజగత్పూర్ణాత్మ సర్వేశ్వరా.

స మా ప్త ము.



ఈ గ్రంథకర్తచే రచియింపబడి గ్రంథముల వివరము.

1 ప్రచండాంజనేయము.
2 విశ్వేశ్వరతారావళి.
} అచ్చులో నున్నవి.
3 మహీధరాత్మజా పరిణయము.
4 సర్వేశ్వర తారావళి.

---

మాజిక్ టైగర్ బాం సీసా 1-కి రు. 0—6—0

హిందూదేశమున తయారుకాబడి మంచిఘాటును పరిమళమును కలిగి యున్నది.

తలనొప్పులను, పార్శ్వనొప్పులను, వాతనొప్పులను, బెణుకు వాపులను, గజ్జి, చీడ, కర్పాణి మొదలగు సర్వబాధలను, విషకాటులకును, శైత్యభారములకు దివ్యసంజీవి వంటిది.

ఇవటూరి మల్లిఖార్జునరావు — మాజిక్ టైగర్ బాం డిపో,

గుడివాడ - కృష్ణాజిల్లా.

# నూతన గ్రంథ

| | రు | అ. | పై |
|---|---|---|---|
| 1. యాజుషస్మార్త మంత్రపాఠము ప్రథమభాగము, స్వరము గ్లేజు ప్రతి 1-కి | | 12 | 0 |
| 2. డిటో ద్వితీయభాగము, సస్వరము. | 1 | 8 | 0 |
| 3. సస్యానందము తాత్పర్యసహితము జ్యోతిషము. | 0 | 4 | 0 |
| 4. ముహూర్తప్రదర్శిని జ్యోతిషము గ్లేజు. | 0 | 12 | 0 |
| 5. సంధ్యామంత్రార్థదర్పణము (స్వరములును,) అర్థమున్ను గలది | 0 | 4 | 0 |
| 6. సిద్ధాంతగ్రహలాఘవము. | 1 | 4 | 0 |
| 7. ఆశౌచనిర్ణయదర్పణము. | 0 | 4 | 0 |
| 8. పురాణోక్త కర్మప్రకాశిక. | 1 | 4 | 0 |
| 9. పురాణోక్త అపరచంద్రికా. | 1 | 4 | 0 |
| 10. స్మార్తా 'నుక్రమణికా సస్వరాంధ్రప్రయోగము లుండును. | 2 | 8 | 0 |

చల్లా - లక్ష్మీనృసింహశాస్త్రి

ఆర్యానందముద్రాక్షరశాల, బం దరు బచ్చుపేట.

